# గ్రహాష్టకములు





రచయిత: త్వరకవి వెంకటనారాయణ

రిటైర్డు ఇంజనీరు, 27.1.1026, వాసవి నగర్, నెల్లూరు.

ఆంధ్రప్రదేశ్ - 524002

ఫోన్ ఫ 0861 - 334260

ఇ.మెయిల్ : శౌనక @ హాట్‌మెయిల్. కామ్

## గ్రంథకర్తచే ప్రకటించిన శాస్త్ర గ్రంథములు

- ★ రాశి ప్రమాణములు
- ★ వివాహ పొంతనములు
- ★ Marriages and Compatibility of Horoscopes
- ★ గ్రహషడ్బలములు
- ★ కందరామాయణము (త్వరకవి మాలె కొండ్రాయుడు గారిచే రచించబడినది)


తర్వకవి వెంకటనారాయణ
రిటైర్డు ఇంజనీరు
27.1/102, వాసవి నగర్, నెల్లూరు – 524 002.
ఫోన్: 0861 – 334260
ఇ–మెయిల్: శౌనక@హాట్.మెయిల్.కమ్
నారాయణ_2000_2000@యాహూ.కమ్

Published with Financial Assistance from
Tirumala Tirupati Devasthanams, Tirupati.





Printed at :

Students Offset Printers
553, Balaji Colony,
Tirupati - 2. Ph: 08574 - 29253.

First Print : 2001

Copies : 1000

Price : 30.00

VS $ : 3.00

For Copies Enquire :

T.V. NARAYANA
Asst. Engineer, P.R.(Retd)
27-1-1020, Vasavi Nagar,
Nellore - 524 002. A.P. India.
Ph: 0861 - 334260

# గ్రహషడ్బలములు



రచయిత: **త్వరకవి వెంకటనారాయణ**

రిటైర్డు ఇంజనీరు, 27.1.1026, వాసవి నగర్, నెల్లూరు.

ఆంధ్రప్రదేశ్ - 524002

ఫోన్ ఫ 0861 - 334260

ఇ.మెయిల్ ః శౌనక @ హాట్‌మెయిల్. కామ్



Phone: 22707 (04633)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

SRI SIDDHESWARI PEETADHIPATI

COURTALLAM - 627802

(Via) Tenkasi- Tirunelveli Dist.-South India.

With Narayanasmritis

*Dt :10-8-94*

---

## శ్రీ ముఖము

శ్రీ త్వరకవి వెంకట నారాయణ గారు వృత్తిరీత్యా యింజనీరు అయినప్పటికీ ప్రవృత్తి రీత్యా జ్యోతిష విజ్ఞాన వేత్త యగుట గుర్తింప దగిన విశేషము.

వారు విశేషముగ శ్రమించి సులభ గ్రాహ్యమగులాగున ''గ్రహషడ్బలములు సాధించుటకు ఉదాహరణలతో విపులీకరించి రచించిన గ్రంధము ''గ్రహషడ్బలములు. జాతకరీత్యా ఫలితములను నిర్ధారించుటకు అతి ఉపయుక్తమైన ప్రక్రియ షడ్బల సాధన. గ్రహముల శుభాశుభఫల నిర్ణయమునకు పూర్వరంగము షడ్బల నిర్ధారణ. దానిని సాధకులకు సులభ సాధ్యమగు లాగున చక్కటి భాషలో అన్ని స్థాయిల వారికి అర్థమగు లాగున రచించినారు.

వేదాంగమైన జ్యోతిషము యిటీవలి కాలములో అవహేళనకు గురియగుటకు కారణము పంద్రెండు రాసులు నవగ్రహముల పేర్లు గూడ తెలియనివారు ప్రజలలో జ్యోతిశాస్త్రమందు గల అచంచల విశ్వాసమును బలహీనతగా భావించి యెట్టి సాధనయైనను చేయకుండా చెప్పెడి ఫలితముల విఫలత్వము, శాస్త్రమే అవహేళనకు ప్రామాణికతనే శంకించే విధముగ బహుసందర్భములలో తిరస్కరింపబడుచున్నది.

జ్యోతిషము ఉదరపోషణకు వృత్తిగా స్వీకరించరాదు. నిత్యము కలిసి తిరిగే సామాన్య వ్యక్తి యొక్క గుణ విశేషములను బట్టి యాతని ప్రవర్తన నిర్ధారించుటలో తరచు విఫలమగుట నిత్య సత్యమే కదా. అట్టి తటిసృష్టి స్థితిలయంములకు, కారణభూతమైన గ్రహముల కార్యాకార్యములను నిర్ధారించుటకు యెంతో తపశ్శక్తి ఆవశ్యకము. అది కల్గిన వారికి వాక్శుద్ధి గూడ తప్పక కలుగగలదు. దానికి పరాకాష్ట అతీంద్రియశక్తి.

. జ్యోతిషమే యొకదైవోపాసనగా భావించే శ్రీ త్వరకవి వెంకట నారాయణగారు అన్ని విధముల యీ గ్రంధరచనకు తగిన వ్యక్తి. వారు అనేక అత్యావశ్యకమైన యిటువంటి రచనలు చేయగల శక్తి యుక్తి ప్రసాదించు లాగున శ్రీ సిద్దేశ్వరీ పీఠాధిష్ఠాన దేవత శ్రీ రాజరాజేశ్వరీ మాతను ప్రార్ధించడమైనది.

నారాయణ స్మృతులతో

(శ్రీ శివచిదానంద భారతీస్వామి)

# గ్రహబలములు - ఒక మాట

రవ్యాది నవగ్రహములకు క్షేత్ర స్థితిని బట్టి బలము చేకూరును. అటువంటి బలసాధనను శ్రీపతి మహాశయుడు 11వ శతాబ్ధములో ఒక వుత్గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. ఆ వుత్గ్రంథమును కోమండూరి పార్ధసారథి అయ్యంగారు అను మరియొక మహాశయుడు తెలుగులో ప్రకటించెను. ఆ పుస్తకము అమూల్యము. జ్యోతిష్యము అవగాహనలేనిదే అర్ధమగుట కష్టము. పునర్ముద్రణకు కూడా నోచుకోన్నట్లులేదు. ఇంగ్లీషు భాషలో బెంగుళూరు వెంకట్రామన్‌గారు గ్రహ భావబలమనే పుస్తకము ప్రచురించియున్నారు. మంచి విలువైనది. పునర్ముద్రణ జరుగుతూయున్నది. అదియేగాక ఇంగ్లీషులోనే పండితాభూషణ వి.సుబ్రమణ్యంగారు చాలా విపులంగా ముద్రించి యున్నారు. ఆ పుస్తకము కూడా పునర్ముద్రణకు నోచుకొన్నట్లులేదు.

సులభశైలిలో తెలుగు భాష యందు యీ గ్రహ బలగణితము అవసరమని భావించి వీలైనంతవరకు అందరికి అర్ధమయ్యేటటుల వ్రాయవలయునని సంకల్పముతో యీ చిన్న పుస్తకము వ్రాశితిని. యీ పుస్తకములో జాతక పరిశీలనకు కావలసిన ముఖ్య గ్రహబలములను మాత్రమే ప్రస్తావించడమైనది.

ముఖ్యముగా యీ గ్రంథములో భావములలో గ్రహము యొక్క బలము గ్రహముల యొక్క షడ్బలములు మరియు భావబలమును సంపూర్ణముగా నాకు చేతనైనంతవరకు వివరించి యున్నాను. నేను షుమారు అయిదు దశాబ్ధముల నుండి యీ జాతక శాస్త్రము నందు ఫలితముల కన్నా గణితమే అధ్యయనము చేయుచుంటిని. స్వర్గీయ నేలనూతుల రామక్రిష్ణయ్యగారు నాకు యీ శాస్త్రము అబ్బుటకు ఎంతో కృషి చేసినారు. గ్రహస్ఫుటము షడ్బలములు కట్టుట అవలీలగా నేర్పించినారు. గ్రహముల బాగోగులు చూడక ఫలితములు చెప్పట

సాహసమే అగును. గ్రహ బలములు తెలుసుకోకుండా శాస్త్రాన్ని కళంక పరచడం మంచిది కాదని ఎక్కువ సమయము గణితముకే వుపయోగించినాను.

రాశి ప్రమాణములు అను ఒక చిన్న పుస్తకము టి.టి.డి వారి సాయముతో వెలువడివున్నది. అందులో ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్య పట్టణములకు రాశి ప్రమాణములు, చరఖణ్డములు యిచ్చివున్నవి. ఆ పుస్తక సహాయముతో సూర్యోదయమును స్థానిక ప్రదేశమునకు గణించుటకు వుపకరించును. యీ పుస్తకములో కూడా సూర్యోదయము సాధించుట అను బంధములలో చరఖణ్డములు యిచ్చివున్నవి. అహర్గణము గణించుట కూడా యిచ్చివున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో యీ పుస్తకము కొంత విలువ కలుగుననే వుద్దేశ్యముతో మరియు అవకాశమున్నవారు శులభముగా గ్రహబలములు సాధించుటకు వుపయోగపడునని వ్రాయడమేగాని తెలివితేటలు ప్రదర్శించుటకు మాత్రము కాదు. మా యింటి పేరు 'త్వరకవి' కాని కవిత్వము నాకు అబ్బలేదు. జ్యోతిష్యము అబ్బింది. అది అంతయు గ్రహముల యొక్క ప్రభావమేగాని యింకొకటిగాదు.

త్వరకవి వంశసంభవుడు ఉదారుడు వేంకటసుబ్బయాఖ్యుడు. నాలకి ద్వితీయ కుమారుడను. శౌనక గోత్రీయుడను. ఆరువేల శాఖవాడను. మూడన్నర దశాబ్దములు ప్రభుత్వ వుద్యోగము చేసి పదవి విరమణను 1986. 08. 31 చేయడం జరిగినది. నా జన్మభూమికి దగ్గర నెల్లూరులో స్థిర నివాస మేర్పరచుకున్నాను. ఏదైనా తప్పులున్న యెడల మరు ముద్రణలో సవరింపబడును. క్షమించ ప్రార్థన



ఇట్లు విధేయుడు

త్వరకవి వేంకటనారాయణ

27-1/1026 వాసవి నగర్, నెల్లూరు 524 002.

ఫోన్ 0861 - 334260

# గ్రహ షడ్బలములు

## విషయసూచిక

గ్రహషడ్బలములు : పేజి నుండి




**త్వరకవి వేంకటనారాయణ**

రిటైర్డు అసిస్టెంటు యింజనీయరు

27.1/1026 వాసవి నగర్, నెల్లూరు - 2.

ఫోన్ : 0861-334260



మొదటి ముద్రణ 2001 --- 1000 కాపీలు




వెల : రూ. 30.00

$ 3.00

# గ్రహభావఫలము - షడ్బలములు ఇష్ట కష్ట ఫలములు

గ్రహముల యొక్క భావములలో వాటి యొక్క బలము. గ్రహముల యొక్క షడ్బలములు. ఇష్ట కష్ట ఫలములు భావముల యొక్క బలము యిత్యాదులతో కూడుకొనియున్నది.

1. భావస్థితబలము, గ్రహములకు ఏఏ భావములో ఎంతెంత బలమున్నదో కనుగొనుట.

2. షడ్బలములు ఈ షడ్బలములు ఆరు విధములుగా కనుగొనవలయును. ఈ ఆరు బలములు వేర్వేరుగా గుణింపవలయును. ఎవ్వియన :-

2.1 స్థానబలము 2.2 దిగ్బలము 2.3 కాలబలము 2.4 చేష్టాబలము 2.5 నైసర్గిక బలము 2.6 దృక్బలము

3. గ్రహముల యొక్క ఇష్ట కష్ట ఫలములు

4. భావముల యొక్క బలము

పై విధముగా ఒక జాతకమును గణించి పరిశీలించిన యెడల ఫలితములు చెప్పటకు కొంత దోహదపడును. వీలైనంత వరకు పాఠకులకు అర్థమయ్యేటట్లు శాస్త్రానికి కొంత విలువ యిచ్చి కేవలము రాశి చక్రమును బట్టి ఏదో చెప్పి కళంకము కలుగుకుండ చూచుటకు వ్రాయడమైనది. తెలుగులో వచన రూపములో పాఠకులు విసుగు చెందకుండా వుండుటకు గణిత సౌలభ్యము కొరకు దశాంశ పద్ధతిని భాగలలో అనుసరించడమైనది. బలమును రూప - విరూపములో గణించడమైనది. షష్ట్యంశలు అనగా విరూపములు. మూడూ నాలుగు దశాంశాల వలకు వేయడము జరిగినది. కొంత మానాలు తెలుసుకోవడము అవసరము. మానాలు యీ క్రింద పొందు పరచడమైనది.

| | | |
|---|---|---|
| 60 విరూపములు | 1 రోజు = 24 గంటలు లేక 60 విఘడియలు | |
| 60 షష్ట్యంశలు | 1 రూపము | 1 గంట = 60 నిముషములు = 2 1/2 ఘడియ |

| | | |
|---|---|---|
| ౬౦ విలిప్తలు | ౧ లిప్త | ౧ ఘడియ = ౬౦ విఘడియలు |
| ౬౦ లిప్తలు | ౧ భాగ | ౧ విఘడియ = ౨౪ సెకండ్లు |
| ౩౦ భాగలు | ౧ రాశి | ౧ నిముషము = ౨ ౧/౨ విఘడియలు/ ౬౦ సెకండ్లు |
| ౧౨ రాసులు | ౧ భగణము | ౧ అసు = 4 సెకండ్లు |
| ౧ రాశి | ౧౮౦ లిప్తలు | ౬అసులు = ౧ విఘడియ |

యీ పైన పేర్కొనిన మానాను సాధ్యమైనంతవరకు జ్ఞాపకము ఉంచుకొనుట మంచి.

## ఉదాహరణ జాతకము

జననము సిద్ధార్థి నామ సంవత్సరము పుష్య శుక్ల ద్వాదశి ఆదివారం సరియగు తే ౩౦.౧౨.౧౯౭౯ దిన ఉదయము గం. ౬.౦౦లకు I.S.T. జన ప్రదేశము 14° - 27° ఉ 80°-00 తూర్పు సవరణ ౧౦ నిముషములు. లాహిరి వారి ఎఫిమెరిసు ప్రకారం గ్రహస్ఫుటము భావస్ఫుటము చేయడం జరిగినది. గణిత సౌలభ్యము కొరకు భాగలు దశాంశ పద్ధతిలో చేయడమైనది. స్థానిక కాలము ౦౫.౫౦.౦౦ ఉదయము సైడ్ రియల్ కాలము గ. ౧౨.౨౦.౫౮ స్థానిక సూర్యోదయము గం. ౦౬.౨౫.౧౨లు. L.M.T.

యిండియన్ స్టాండర్డ్ టైము గం. ౦౬.౩౫.౧౨లు I.S.T.

శనివారము సూర్యోదయాది జననము ఘడియలు ౫౮ విఘడియలు ౩౨

ఆదివారము సూర్యోదత్పూర్వం జననము ఘడియలు ౦౧ విఘడియలు ౨౮

అయనాంశ ౨౩.౩౪.౩౧ (లాహిరి)

| గ్రహస్ఫుటము | | | | | | భావస్ఫుటము | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహము | రా | భా | లి | వి | భాగలలో | భావం | ఆరంభము | మధ్యమము | అంత్యము | ఆద్యంత |
| 1. రవి. | 08 | 14 | 07 | 23 | 254.123 | 1 | 231.616 | 245.482 | 261.616 | 30.000 |
| 2. చంద్ర. | 01 | 03 | 00 | 22 | 33.006 | 2 | 261.616 | 277.751 | 293.885 | 32.269 |
| 3. కుజ. | 04 | 20 | 02 | 14 | 140.037 | 3 | 293.885 | 310.026 | 326.754 | 32.269 |
| 4. బుధ. | 08 | 01 | 22 | 52 | 241.381 | 4 | 326.154 | 342.289 | 356.154 | 30.000 |
| 5. గురు. | 04 | 16 | 39 | 00 | 136.650 | 5 | 356.154 | 010.026 | 023.885 | 27.731 |
| 6. శుక్ర. | 09 | 15 | 22 | 32 | 285.376 | 6 | 023.885 | 037.751 | 051.616 | 27.731 |
| 7. శని. | 05 | 03 | 23 | 00 | 153.383 | 7 | 051.616 | 065.482 | 086.616 | 30.000 |
| 8. రాహు. | 04 | 06 | 50 | 55 | 126.849 | 8 | 081.616 | 097.751 | 113.885 | 32.269 |
| 9. కేతు. | 10 | 06 | 50 | 55 | 306.849 | 9 | 113.885 | 130.026 | 146.154 | 32.269 |
| 10. లగ్నం. | 08 | 05 | 28 | 56 | 245.482 | 10 | 146.154 | 162.289 | 176.154 | 30.000 |
| 11. దశమం. | 05 | 12 | 17 | 22 | 162.289 | 11 | 176.154 | 190.026 | 203.885 | 27.731 |
| 12. అయనాంశ. | -- | 23 | 34 | | 23.575 | 12 | 206.154 | 217.751 | 231.616 | 27.731 |

<table>
<tr><td></td><td></td><td>చంద్ర</td><td></td></tr>
<tr><td>కేతు</td><td rowspan="2" colspan="2">రాశి</td><td></td></tr>
<tr><td>శుక్ర</td><td>కుజ<br>గురు<br>శని<br>రాహు</td></tr>
<tr><td>రవి<br>బుధ<br>లగ్నం</td><td></td><td>శని</td><td></td></tr>
</table>

<table>
<tr><td></td><td>బుధ</td><td>లగ్నము<br>శుక్ర</td><td>రాహు</td></tr>
<tr><td>శని</td><td rowspan="2" colspan="2">అంశ</td><td></td></tr>
<tr><td>చంద్ర</td><td>రవి,<br>గురు</td></tr>
<tr><td>కేతు</td><td></td><td>కుజ</td><td></td></tr>
</table>

## 1 వ అధ్యాయము గ్రహముల యొక్క భావబలము

భావమధ్యమములో గ్రహములు పూర్ణ బలవంతులై యుందురు. భావ ఆరంభ అంత్యములలో బలము తగ్గుచూ హెచ్చుచూ యుండును. ఈ హెచ్చు తగ్గులను త్రైరాశికము చేసి కనుగొనవలయును. గ్రహమునకు విరామ సంధికి వ్యత్యాసము ఏది తక్కువో అది తీసుకొని పూర్వ ఉత్తర భాగలలో సంస్కరించి శేషభాగాలను భావార్ధముతో భాగించిన యెడల గ్రహము యొక్క భావబలము చేకూరును.

| గ్రహము | స్ఫుటభాగలు | దగ్గర విరామసంధి | శేషభాగలు భావార్ధం | భావబలము |
|---|---|---|---|---|
| 1. రవి | 254.123 | 261.616 . 1 | 7.493 / 15.000 | 0.495 |
| 2. చంద్ర | 33.006 | 023.885 . 6 | 9.121 / 13.865 | 0.657 |
| 3. కుజ | 140.037 | 146.154 . 9 | 6.117 / 16.134 | 0.379 |
| 4. బుధ | 241.381 | 231.616 . 1 | 9.765 / 15.000 | 0.651 |
| 5. గురు | 136.650 | 146.154 . 9 | 9.504 / 16.134 | 0.589 |
| 6. శుక్ర | 285.376 | 293.885 . 2 | 8.509 / 16.134 | 0.527 |
| 7. శని | 153.383 | 146.154 . 10 | 7.229 / 15.000 | 0.448 |
| 8. రాహువు | 126.849 | 113.885 . 9 | 12.964 / 16.134 | 0.803 |
| 9. కేతువు | 306.849 | 293.885 . 3 | 12.964 / 16.134 | 0.803 |

ఈ జాతకములో కుజ శనులు తప్ప మిగతా గ్రహములు సగము కన్న జాస్తి బలము కలిగియున్నవి. ఆయా దశా భుక్తుల యందు ఫలితములు చూచుకొనుటకు వుపకరించును. ఆయా గ్రహ కారకత్వమును గూడా పరిశీలించుటకు దోహదపడగలదు.

ఒకటవ <u>అధ్యాయము పరిసమాప్తము</u>

## 2వ అధ్యాయము, స్థానబలము

షడ్బలములలో మొదటిది ముఖ్యమయినది స్థాన బలము. గ్రహములలో రవ్యాది సప్తగ్రహములకే చెప్పబడియున్నది. ఛాయా గ్రహములైన రాహుకేతువులకు చెప్పియుండలేదు. కాని కాళిదాసు విరచిత ఉత్తర కాలామృతములో యీ క్రింది విధముగా చెప్పియున్నారు.

| | ఉచ్చ | స్వక్షేత్రం | మూలత్రికోణం | శత్రుక్షేత్రం | మిత్ర | సమ |
|---|---|---|---|---|---|---|
| రాహు : | వృషభం | కుంభం | మిధునం | సింహం | తుల | మేషం |
| కేతువు : | వృశ్చికం | వృశ్చికం | కన్య | కటకం | మకరం | ధనస్సు-మీనం |

మొదటి కలమందు వున్నపుడే వుచ్ఛ బలము పూర్తిగా అని చెప్పియున్నారు. దానికి సప్తమరాశియే పరమనీచస్థానములు అని ఎరుగవలయును. ఈ గ్రహములుకు దశలు బల విషయములో శ్రీపతి ఎక్కడ చెప్పియుండలేదు. అందువలన వాటి యొక్క బలసాధన చేయుటలేదు. ఏ క్షేత్రములో వుంటే ఆ స్థానాధిపతి బలమే మనము తీసికొనవలసివుండును. గణితము భాగలను దశాంశ పద్ధతిలో సౌలభ్యము కొరకు చేయడమైనది.

ఈ స్థాన బలములో అయిదు ఉప బలములున్నవి.

1. ఉచ్చబలము, 2. సప్తవర్గబలము, 3. ఓజయుగ్మరాశ్యాంశబలము, 4. కేంద్ర బలము, 5. ద్రేక్కాణ బలము.

మొదటిది ఉచ్చబలము. ప్రతి గ్రహము 12 రాసులలో ఒక రాశియందు ఉచ్చస్తితి కలిగియుందురు. ఆ వుచ్ఛ స్తితిలో పూర్ణబలము కలవారై యుందురు. దానికి వ్యతిరిక్త సప్తమ రాశి నీచస్తితి, బలహీనులగుదురు. ఈ మధ్య స్తితిలో త్రై రాశికముచేసి బలము కనుగొనవలయును.

ఎట్లనిన : స్ఫుట గ్రహములో నీచగ్రహమును తీసివేసి శేషము 6 రాసుల కన్న అధికమైనచో పండ్రెండు రాసులలో తీసివేసి, సంస్కరించిన శేషమును లిప్తలు చేసి 10800చే (6X30X60) భాగించిన ఉచ్చబలషష్ట్యంశలు (విరూపములు) వచ్చును. సులభముగా

స్ఫుటగ్రహము (భాగలలో) (-) నీచస్ఫుటము (భాగలలో) = శేషము+3 ÷ ఉచ్చబలము.

రవికి తులలో 10 భాగలు, చంద్రునకు వృశ్చికములో 3 భాగలు, కుజునకు కటకములో 18 భాగలు, బుధునకు మీనములో 13 భాగలు, గురువునకు మకరములో 5 భాగలు, బుధునకు కన్యలో 27 భాగలు, శనికి మేషమందు 20 భాగలు వరకు నీచస్థితి కలిగియుందురు. అనుబంధము 1 చూడుము.

## ఉదాహరణ జాతకము

| గ్రహములు | స్ఫుటధాగలు | నీచభాగలు | శేషభాగలు ÷ 3 | ఉచ్చబల పుష్ట్యంశలు |
|---|---|---|---|---|
| 1. రవి | 254.123 | 190.000 | 64.123÷3 | 21.374 |
| 2. చంద్ర | 33.006 | 213.000 | 179.994÷3 | 59.998 |
| 3. కుజ | 140.037 | 118.000 | 22.037÷3 | 7.345 |
| 4. బుధ | 241.381 | 345.000 | 103.619÷3 | 34.539 |
| 5. గురు | 136.650 | 275.000 | 138.350÷3 | 46.116 |
| 6. శుక్ర | 285.376 | 177.000 | 108.376÷3 | 36.125 |
| 7. శని | 153.383 | 20.000 | 133.383÷3 | 44.461 |

స్థానబలములో రెండవది సప్తవర్గబలము. షోడశవర్గులు వున్నప్పటికి సప్తవర్గల యొక్క బలము మాత్రమే పరిగణలోకి తీసుకొన్నారు. భూచక్రములో 12 రాసులుండును. అందులో ఒక రాశిని గణితములో తీసుకొనవలయును. (2) రెండవది రాశిని రెండుభాగములు చేసిన హోర అనియు (3) భాగములు చేసిన ద్రేక్కాణమనియు (4) ఏడు భాగములు

చేసిన సప్తాంశ మనియు (5) తొమ్మిది భాగములు చేసిన నవాంశయనియు (6) 12 భాగములు చేసి ద్వాదశాంశ అనియు (7) రాశిని 30 భాగలు చేసిన త్రింశయనియు తెలుసుకొనగలరు. అనుబంధము 2 లో సప్తవర్గుల యొక్క అధిపతులను యివ్వడమైనది. పై సప్తవర్గులలో గ్రహస్థితిని బట్టి బలము చేకూరును. మూల త్రికోణము 45 షష్ట్యంశలు, స్వక్షేత్రము 30 షష్ట్యంశలు, అధిమిత్ర క్షేత్రము 22.5 షష్ట్యంశలు, మిత్రక్షేత్రము 15 షష్ట్యంశలు, సమక్షేత్రమయిన 7.5 షష్ట్యంశలు, శత్రుక్షేత్రమైన 3.75 షష్ట్యంశలు, అధిశత్రు క్షేత్రమైన 1.875 షష్ట్యంశలు చేకూరును

ఇక్కడ గ్రహముల యొక్క మిత్రత్వ శత్రుత్వము నైసర్గికముగాతీసుకొని జాతకములో తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వములను నిర్ణయించి బలము కేటాయించవలయును. ఏ గ్రహముకైనను 2.3.4.10.11.12 తాత్కాలిక గ్రహములున్న మిత్రులగుదురు. అటులనే 5.6.7.8.9 రాసులయందు వారు శత్రువులగుదురు.

| గ్రహము | మిత్రులు | సములు | శత్రువులు |
|---|---|---|---|
| 1. రవి | చ.గు.కు. | బుధ | శుక్ర, శని |
| 2. చంద్ర | '' రవి, బుధ | '' కుజ, గురు, శుక్ర, శని | లేరు - - |
| 3. కుజ | '' రవి, చంద్ర, గురు | '' శుక్ర, శని | బుధ |
| 4. బుధ | '' రవి, శుక్ర | కుజ, గురు, శని | చంద్ర |
| 5. గురు | '' రవి, చంద్ర, కుజ | శని | బుధ, శుక్ర |
| 6. శుక్ర | ''బుధ, శని | కుజ, గురు | రవి, చంద్ర |
| 7. శని | ''బుధ, శుక్ర | గురు | రవి, చంద్ర, కుజ |

| | | | | |
|---|---|---|---|---|
| తాత్కాలిక మిత్రత్వము | + | నైసర్గిక మిత్రత్వము | = | అధిమిత్ర |
| - do - | + | - do - సమత్వము | = | మిత్ర |
| - do - | + | - do - శత్రుత్వము | = | సమ |
| తాత్కాలిక శత్రుత్వము | + | - do - శత్రుత్వము | = | అధిశత్రు |
| - do - | + | - do - మిత్రత్వము | = | సమ |
| - do - | + | - do - సమత్వము | = | శత్రు |

## ఉదాహరణ జాతకములో

| గ్రహము | అధిమిత్ర | మిత్ర | సమ | శత్రు | అధిశత్రు |
|---|---|---|---|---|---|
| 1 రవి | -- | -- | చంద్ర, కుజ, గురు, శుక్ర, శని | బుధ | -- |
| 2. చంద్ర | -- | కుజ, గురు | రవి, బుధ | శుక్ర, శని | |
| 3. కుజ | చంద్ర | శని | గురు, రవి | శుక్ర | బుధ |
| 4. బుధ | శుక్ర | శని | రవి | గురు, కుజ | చంద్ర |
| 5. గురు | చంద్ర | శని | రవి, కుజ | -- | బుధ, శుక్ర |
| 6. శుక్ర | బుధ | -- | శని, రవి | కుజ, గురు | చంద్ర |
| 7. శని | బుధ | -- | కుజ, శుక్ర, రవి | -- | చంద్ర |

## ఉదాహరణ జాతకములో

| వర్గ | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1. రాశి | సమ | శత్రు | సమ | శత్రు | సమ | సమ | అధిమిత్ర |
| 2. హోర | స్వ | స్వ | అధిమిత్ర | అధిశత్రు | అధిమిత్ర | సమ | అధిమిత్ర |
| 3. ద్రేక్కాణ | సమ | శత్రు | స్వ | శత్రు | స్వ | స్వ | అధిమిత్ర |
| 4. సప్తాంశ | సమ | మిత్ర | సమ | శత్రు | సమ | స్వ | మిత్ర |
| 5. నవాంశ | స్వ | శత్రు | శత్రు | శత్రు | సమ | స్వ | స్వ |
| 6. ద్వాదశ | సమ | సమ | స్వ | శత్రు | మిత్ర | అధిశత్రు | సమ |
| 7. త్రింశ | సమ | శత్రు | అధిశత్రు | శత్రు | స్వ | శత్రు | సమ |

| --- | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు | షష్ఠ్యంశలు |
|---|---|---|---|---|---|---|---|
| 1. రాశి | 7.500 | 3.750 | 7.500 | 3.750 | 7.500 | 7.500 | 22.500 |
| 2. హోర | 30.000 | 30.000 | 22.500 | 1.875 | 22.500 | 7.500 | 22.500 |
| 3. ద్రేక్కాణ | 7.500 | 3.750 | 30.000 | 3.750 | 30.000 | 30.000 | 22.500 |
| 4. సప్తాంశ | 7.500 | 15.000 | 7.500 | 3.750 | 7.500 | 30.000 | 15.000 |
| 5. నవాంశ | 30.000 | 3.750 | 3.750 | 3.750 | 7.500 | 30.000 | 15.000 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 4. సప్తాంశ | 7.500 | 15.000 | 7.500 | 3.750 | 7.500 | 30.000 | 15.000 |
| 5. నవాంశ | 30.000 | 3.750 | 3.750 | 3.750 | 7.500 | 30.000 | 15.000 |
| 6. ద్వాదశ | 7.500 | 7.500 | 30.000 | 3.750 | 15.000 | 1.875 | 7.500 |
| 7. త్రింశ | 7.500 | 3.750 | 1.875 | 3.750 | 30.000 | 3.750 | 7.500 |
| | ------ | ------ | ------ | ------ | ------ | ------ | ------ |
| మొత్తం | 97.500 | 67.500 | 103.125 | 24.375 | 120.000 | 110.625 | 127.500 |
| షష్ఠ్యంశలు | ------ | ------ | ------ | ------ | ------ | ------ | ------ |

## 3. స్థానబలములో మూడవది ఓజ. యుగ్మ రాశ్యాంశబలము.

గ్రహములు వారి వారి రాశి అంశ స్థితిని బట్టి కొంతబలము చేకూరును. ఓజ. రాశ్యాంశలయందు రవికి కూజ, బుధ, శని గ్రహములు వుండిరేని 15 షష్ఠ్యంశలు చేకూరును. అదే విధముగా సమ రాశి యందు చంద్ర శుక్ర గ్రహములుండి లేని 15 షష్ఠ్యంశలు చేకూరును.

ఓజ రాశులు : మేషం, మిధునం, సింహం, తుల, ధనస్సు, కుంభం

యుగ్మరాశులు : వృషభం, కటకం, కన్య, వృశ్చికం, మకరం, మీనం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. రవి | 15 | 15 | .. | .. | 30 షష్ట్యంశలు |
| 2. చంద్ర | -- | -- | 15 | 15 | 30 -do- |
| 3. కుజ | 15 | 15 | .. | .. | 30 -do- |
| 4. బుధ | 15 | 15 | .. | .. | 30 -do- |
| 5. గురు | 15 | 15 | .. | .. | 30 -do- |
| 6. శుక్ర | -- | -- | 15 | 15 | 30 -do- |
| 7. శని | -- | 15 | .. | .. | 15 -do- |

## 4. స్థాన బలములతో నాల్గవది కేంద్రాది బలము

గ్రహములు కేంద్రమందు అనగా 1.4.7.10 స్థానములందున్న 60 షష్ట్యంశలు, ఫణఫరములందు 2.5.8.11 స్థానములందు 30 షష్ట్యంశలు అపోక్లిమ రాశులయందు 3.6.9.12 స్థానములందు 15 షష్ట్యంశలు బలము కలుగును.

### ఉదాహరణ జాతకములో

రవి, బుధ, శని గ్రహములకు కేంద్రస్తితి వలన 60 షష్ట్యంశలు
శుక్ర గ్రహమునకు ఫణఫరస్తితి వలన 30 -do-
చంద్ర, కుజ, గురు గ్రహములకు అపోక్లిమ స్తితి వలన 15 -do-
బలముచేకూరును.

5. స్దానబలములో అయిదవది <u>ద్రేక్కాణబలము.</u> గ్రహములను స్త్రీ, పురుష, నపుంసక గ్రహములుగా వర్ణింపబడివున్నది. చంద్ర, శుక్రులు స్త్రీ గ్రహములు గాను, రవి, కుజ, గురు గ్రహములను పురుషులగాను, శని, బుధ గ్రహములు నపుంసకులు గాను వర్ణింపబడివున్నది. పురుష గ్రహములకు (రవి, కుజ, గురు) మొదటి ద్రేక్కాణమందు, నపుంసక గ్రహములుకు మధ్య ద్రేక్కాణమందును స్త్రీ గ్రహములకు అంత్య ద్రేక్కాణమందును 15 షష్ట్యంశలు బలము చేకూరును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రవి | పురుష | 2వ ద్రేక్కాణము | బలములేదు | ఉదాహరణ |
| 2. | చంద్ర | స్త్రీ | 1వ -do- | -do- | జాతకమందు |
| 3. | కుజ | పురుష | 3వ -do- | -do- | ద్రేక్కాణబలము |
| 4. | బుధ | నపుంసక | 1వ -do- | -do- | లేదు |
| 5. | గురు | పురుష | 2వ -do- | -do- | |
| 6. | శుక్ర | స్త్రీ | 2వ -do- | -do- | |
| 7. | శని | నపుంసక | 1వ -do- | -do- | |

యీ పై వుదహరించిన అయిదింటి సముదాయమే స్థానబలము

| గ్రహములు | ఉచ్చబలము | సప్తవర్గబలము | ఓజయుగ్మ | కేంద్రాది | ద్రేక్కాణబలము | మొత్తము | వుండవలశినది |
|---|---|---|---|---|---|---|---|
| 1. రవి | 21.374 | 97.500 | 30.000 | 60.000 | -- | 208.874 | 165 |
| 2. చంద్ర | 59.998 | 67.500 | 30.000 | 15.000 | -- | 172.498 | 133 |
| 3. కుజ | 7.345 | 103.125 | 30.000 | 15.000 | -- | 155.470 | 96 |
| 4.బుధ | 34.539 | 24.375 | 30.000 | 60.000 | -- | 149.914 | 165 |
| 5. గురు | 46.116 | 120.000 | 30.000 | 15.000 | -- | 211.116 | 165 |
| 6. శుక్ర | 36.125 | 110.625 | 30.000 | 30.000 | -- | 206.750 | 133 |
| 7. శని | 44.461 | 127.500 | 15.000 | 60.000 | -- | 246.961 | 96 |

బుధగ్రహము తప్ప కొరవ అన్ని గ్రహములు పరిపూర్ణ స్థానబలము కలిగియున్నవి.

2వ అధ్యాయము పరిసమాప్తము

## 3వ అధ్యాయము దిగ్బలము

గ్రహములు కొన్ని దిశలయందు పూర్ణ బలవంతులై యుందురు. ఆ దిశలకు వ్యతిరిక్త దిశలయందు బలహీనులగుదురు. లగ్నము తూర్పు దిక్కు దానికి వ్యతిరిక్తము పడమర సప్తమమగును. అదే విధముగా దశమ భావము దక్షిణమున పరిపూర్ణము. దానికి వ్యతిరిక్తము ఉత్తరము చతుర్థము అయినది. పూర్ణబలము కలిగిన గ్రహములు ఆరోహణ, అవరోహణ సంచారములో హెచ్చు తగ్గులుండును. ఆ బలమునే త్రైరాశికము ద్వారా కనుగొనవలయును.

1. బుధ, గురు లగ్నములో తూర్పున పూర్ణబలవంతులు
2. రవి, కుజ దశమములో దక్షిణమున పూర్ణబలవంతులు
3. శని సప్తమములో పడమర దిశయందు పూర్ణబలవంతులు
4. చంద్ర, శుక్ర చతుర్థములో ఉత్తర దిశయందు పూర్ణబలవంతులు

బలము కలిగిన భావములకు సప్తమము బల శూన్యం. గ్రహ భావస్ఫుటములచే త్రైరాశికము చేసి బలమును కనుగొనవలయును.

1.రవి, కుజులు వారి స్పుటములో చతుర్థ భావమును తీసివేశి శేషము 6 రాశులకు మించెనేని 12 రాసులలో తీసివేయుము. శేషమును లిప్తలు చేసి 10800 చే భాగించగా దిగ్బలము వచ్చును. ఆ దిగ్బలము రూపములలో వచ్చును. భాగలలో స్పుటము చేసి వున్నది. గనుక శేషముని 3 చే భాగించిన దిగ్బల షష్ఠ్యంశలు (60 x 60 10800)

దిగ్బల సంగ్రహ పట్టిక

| | గ్రహస్పుటము | భావము | భాగలు | 3చేభాగించగా వచ్చిన షష్ఠ్యంశలు | వుండవలసిన షష్ఠ్యంశలు |
|---|---|---|---|---|---|
| 1. రవి | 254.123 | IV 342.289 | 88.166 | 29.389 | 35 |
| 2. చంద్ర | 33.006 | x 165.289 | 129.183 | 43.061 | 50 |
| 3. కుజ | 140.037 | IV 342.289 | 157.748 | 52.582 | 30 |
| 4. బుధ | 241.381 | VII 65.482 | 175.899 | 58.633 | 35 |
| 5. గురు | 136.650 | VII 65.482 | 71.168 | 23.722 | 35 |
| 6. శుక్ర | 285.376 | x 162.289 | 123.087 | 41.029 | 50 |
| 7. శని | 153.383 | I 245.482 | 92.099 | 30.699 | 30 |

కుజ,బుధ,శని గ్రహములు పూర్తి దిగ్బలము కలిగియున్నారు. రవి 83.96 % చంద్ర 86.122%, కుజ 175.27%, బుధ 167.52%,గురు 67.77%,శుక్ర 82.058%,శని 102.33%, శాతము దిగ్బలవంతులు అన్ని గ్రహములు.

సగముపై దార్గ్బలము కలిగి వున్నారు

3వ అధ్యాయము పరిసమాప్తము

## 4వ అధ్యాయము 3. కాల్బలము

### షడ్బలములలో 3వది కాల్బలము :

ఈ కాల్బలములో 1. దివారాత్రి బలము, 2. పక్ష బలము, 3. త్రిభాగఫలము, 4. అబ్దమాసాది బలము, 5. అయిన బలము, 6. యుద్ద బలము. యీ ఆరింటి సముదాయమే కాల్బలము అగును. చాలా క్లిష్టమయినది. ఓపిక స్థిర చిత్తము చాలా అవసరము. 4.3.1 దివారాత్రిబలము. యీ బలము కనుగొనుటకు సూర్యోదయము గణించుట అవసరము. వేరే రాశి ప్రమాణములు పుస్తకము ప్రచురించి యున్నది. దాని ప్రకారము సూర్యోదయము సాధించుట సులభసాధ్యము. అయినను 13వ అక్షాంశమునుండి 20వ అక్షాంశము వరకు చరఖణ్ణములు యిచ్చివున్నవి. వాటిని బట్టి ఆంధ్రప్రదేశములో అన్ని పట్టణములకు చరకణ్ణములు సాధించుకొనవచ్చును.చూడు అనుబంధము 3. ఆ చరఖణ్ణ ముల సహాయముతో సూర్యోదయము కనుగొనవచ్చును. సూర్యోదయం స్థానిక కాలమాణ ప్రకారము వచ్చును. ఆ స్థానిక కాలములో వ్యత్యాసము సంస్కరించిన యెడల యిండియన్ స్టాండర్డ్ టైమ్ అగును. I.S.T 82° - 30' గా యున్నది

అనగా G.M.Tకి 5 గం. 30 ని. ముందు వున్నది. ముందు కావలసిన రోజుకు సాయన రవిని కనుగొనుము. ప్రస్తుతము అన్ని పంచాంగములలో గ్రహస్ఫుటము అయనాంశలు యిచ్చుచున్నారు. నిరయణ గ్రహస్ఫుటములో అయనాంశలు చేర్చిన యెడల సాయన స్ఫుట రవి అగును.

## తదుపరి భుజ కనుగొనుట :

1. సాయన రవి 3 రాసులలో నున్నయెడల అదియే భుజమగును.

2. 3రాసుల నుండి 6 రాసులలో నున్నయెడల ఆరు రాసులలో సాయన రవిని తీసివేయుము.

3. ఆరు రాసుల నుండి తొమ్మిది రాసులలో నున్న యెడల సాయన రవిలో ఆరు రాసులు తీసివేయుము.

4. 9 రాసుల నుండి 12 రాసులలో నున్న యెడల 12 రాసులలో స్ఫుట రవిని తీసివేయుము.

భుజను సాధించిన తదుపరి సాయన రవి మేషాది షట్కము అనగా మేషము నుండి కన్య వరకు సంచరించుచున్న యెడల దినార్ధములో కలుపవలయును. తులాది షట్కము (తుల నుండి మీనాంతంవరకు) దినార్ధములో తీసివేయవలయును. ఉదాహరణ జాతకము జనన తేది 30.12.79 ఆదివారము. అక్షాంశ రేఖ 14° - తూ 27° రేఖాంశ 80°-00 తూర్పు. అనుబంధము 3 ప్రకారము చర ఖణ్డములు ఆది 30.06 విఘడియలు మధ్య 24.40 విఘడియలు అంత్య 9.80 విఘడియలు అయినవి.

| | రా | బా | లి | వి |
|---|---|---|---|---|
| తే 30.12.1979 వుదయం 5.30 గంటలు నిరయణ స్ఫుటరవి | 08. | 16. | 08. | 22 |
| అయనాంశ లాహిరి ప్రకారము | 00. | 23. | 34. | 41 |
| సాయనరవి | 09. | 09. | 42. | 53 |

9 రాసులపైన 12 రాసులలో నున్న ది 12 రాసులలో తీసివేయగా శేషము 2.20.17.07 ఒకరాశి వరకు (.0 - 1) ఆది చరఖణ్డము రెండు రాసుల వరకు ఆది మధ్య మూడవరాశి వుంటే ఆది మధ్య అంత్యములో అనుపాతముగా వుంచవలయును.

ఇక్కడ భుజస్థానము 2.20.17.07 అనగా ఆది మధ్య

చరఖణ్డములును రాశి స్థానములో వుంటే అంత్య చరఖణ్డములో అనుపాతముగా గుణించవలయును. సాయనరవి తులాది షట్కము గనుక దినార్ధములో తీసివేయవలయును.

ఉదాహరణ జాతకములో సాయనరవి 02. 20. 18. 07

ఆది చరఖణ్డము : 30.06

మధ్య చరఖణ్డము : 24.40

అంత్య చరఖణ్డము 9.80×20.17.07/30

20285/30 = 6.63

= 61.09 విఘడియలు

61-09 విఘడియలు లేక 1 ఘడియ 1.1 09 విఘడియలు అయినది. దినార్ధము (తులాది షట్కముగనుక) 15-00 ఘడియలలో తీవచగా 13 ఘడియలు 59 విఘడియలు అయినది. అహస్సు 13.59X2 = 27 ఘడియలు 58 విఘడియలు అయినది. 13 ఘడియలు, 58 విఘడియలను గంటలు నిముషములలోకి మార్చగా 5 గంటలు 35 నిషములు 12 సెకండ్లు అయినది. దినార్ధము 12 గంటలలో తీసివేయగా సూర్యోదయము గంటలు 6 నిముషములు 24 సెకండ్లు 48 స్థానిక సూర్యోదయము అయినది. దీనిలో సంస్కరణ 10 నిముషములు కలుపగా 06.34-48 I.S.T. యిండియన్ స్టాండర్డ్ కాలమానం ప్రకారం సూర్యోదయం అయినది. కాబట్టి ఉదాహరణ జాతకములో జననము సూర్యోదయాత్పూరము 1 ఘడియ 27 విఘడియలు అయినది. అహస్సు 27-58 ఘడియావిఘడియలు. రాత్రికాలము 60.00(-)27.58= 32ఘడియలు 2 విఘడియలు అయినది.

అర్ధరాత్రి మొదలు, మధ్యాహ్నము వరకు వున్న కాలమును పూర్వనతమనబడును. మధ్యాహ్నము మొదలు అర్ధరాత్రి వరకు అపరనతమనబడును.

సూర్యోదయము మొదలు మధ్యాహ్నములోపల జనన మయ్యేనేని దినార్ధము కన్న తక్కువ వుండెనేని దినార్ధములో జననకాలము తీసివేసిన పూర్వనతమగును. దినార్ధము కంటె జననకాలము ఎక్కువ అయినచో జననకాలములో దినార్ధము తీసివేయును. శేషము అపరవతమగును.

రాత్రియందు జననమయ్యేనేని అర్ధరాత్రికి ముందు అయిన యెడల అస్తమయము నుండి జననకాలమును దినార్ధములో చేర్చగా అపరనతమగును. అర్ధరాత్రి మొదలు సూర్యోదయము లోపల జననమయ్యేనేని రాత్రి శేషము అనగా జనన కాలము మొదలు సూర్యోదయ పర్యంతము దినార్ధములో చేర్చిన యెడల పూర్వనతమగును. పూర్వనతమును ౩౦ ఘడియలలో తీసివేసిన శేషము ఉన్నతమగును. ఉదాహరణ జాతకములో

సూర్యోదయమాది జననకాలము ౫౮ ఘడియలు ౩౩ విఘడియలు జననకాలము మొదలు సూర్యోదయము వరకు ఘడియలు ౦1 విఘడియలు 27 దినార్ధము ఘ 13-౫౯ వి.లు ఘ ౦1 -27 లు కలుపగా 15.2౬ పూర్వనతమైనది. పూర్వనతమును ౩౦ ఘడియల్లో తివచగా శేషము ఘ 14.34 వి.లు ఉన్నతమయినది.

చంద్ర, శని, కుజ గ్రహములు రాత్రి బలవంతులు

రవి, గురు, శుక్ర గ్రహములు పగలు బలవంతులు

బుధుడు అన్ని వేళల యందు బలవంతుడు

## దివారాత్రి బలషష్ట్యంశలు

ఉన్నతము 14 ఘడియలు 34 విఘడియలు లేక 14X6౦=84౦+34=874 విఘడియలు. ఈ విఘడియలను 18౦చే భాగించగా బలము రూపములలో వచ్చును. ౬౦చే పెంచిన షష్ట్యంశలు అగును. 874÷18౦౦=౦.48౬1 రూపము ౬౦చే పెంచిన ౦.48౬1X6౦=2౯.1౬౬ షష్ట్యంశలు అయినది. అనగా విఘడియలను

3చే భాగించిన షష్ట్యంశలు అగును. రవి, గురు, శుక్ర గ్రహములు పగలు బలవంతులు.

నతము 15-26 = 926 విఘడియలు ÷ 3=30.833 షష్ట్యంశలు. బుధునకు ఎల్లవేలలందు 60 షష్ట్యంశలు బలముచే కూరును. (1 విఘడియం = 6 అసువులు లేక ఉన్నత విఘడియలు 6తో పెంచి 180చే భాగించినను బలము షష్ట్యంశలలో వచ్చును.

రవి, గురు, శుక్ర 875X6 = 5250÷180 = 29.166 షష్ట్యంశలు

చంద్ర, కుజ, శని 925X6 = 5550÷180 = 30.833 షష్ట్యంశలు

బుధ ఎల్లవేళల యందు 60.00

4.3.2. కాల్బలములో రెండవది పక్షబలము : ఈ బలము శుక్ల పక్షము. కృష్ణ పక్షము గ్రహముల ఉనికిని బట్టి సాధించవలయును. శుభగ్రహములకు శుక్ల పక్షబలము పాపగ్రహములుకు కృష్ణ పక్షబలము చేకూరును. చంద్ర, గురు, శుక్ర గ్రహములు శుభులు. రవి, కుజ, శని గ్రహములు పాపులు. పాపులతో చేరిన బుధుడు పాపియగును. పూర్ణచంద్రుని బలము రెండింతలు చేయవలయును. శుక్లపక్ష దశమి లగాయితు కృష్ణ పక్ష పంచమి వరకు పూర్ణచంద్రుడు. ఉదాహరణ జాతకములో జననము పుష్య శుక్ల ద్వాదశి కాబట్టి చంద్రుడు పూర్ణ బలవంతుడు.

స్ఫుట చంద్రునిలో స్ఫుట రవిని తీసివేసి శేషము 6 రాసుల కన్న ఎక్కువ వున్నచో 12 రాసులలో తీసివేయుము. శేషము లిప్తలు చేసి 10800 చే (60X30X60) భాగించిన పక్షబలరూపములు అగును. 60 పెంచిన షష్ట్యంశలు అగును.

స్ఫుట చంద్రుడు (-) స్ఫుటరవి = 33-006(-) 254-123= 138-883 భాగలు. 138.883X60 X 60.÷10800 = 138.883 ÷ 3 = 46.294 శుక్లపక్షబలము 60 షష్ట్యంశలలో తీసివేసిన కృష్ణ

పక్షబలము 60-46.94=13.706 కృష్ణ పక్షబలము.

| శుభ గ్రహములు | | పాప గ్రహములు |
|---|---|---|
| చంద్ర 2 X 46.294 = 92.588 షష్ట్యంశలు. షష్ట్యంశలు రెండింతలు | | రవి 13.706 |
| గురు 1X 46.294 = 46.294 | -do- | కుజ 13.706 -do- |
| శుక్ర 1X 46.294 = 46.294 | -do- | శని 13.706 -do- |
| | | బుధ 13.706 -do- |

పాపి అయినాడు

## కాల్బలములో మూడవది త్రిభాగఫలము

### 4.3.3. త్రిభాగఫలము

పగలు గాని, రాత్రిగాని మూడు భాగములు చేయగా పగలు మొదటి భాగమందు బుధునకు 60 షష్ట్యంశలు రెండవ భాగమందు రవికి 60 షష్ట్యంశలు. మూడవ భాగమందు శనికి 60 షష్ట్యంశలు బలముచేకూరును. అదేవిధముగా రాత్రి జననమయ్యేనేని మొదటిభాగము చంద్రునకు రెండవ భాగము శుక్రునకు మూడవ భాగము కుజునకు 60 షష్ట్యంశలు బలముచేకూరును. గురువునకు ఎల్లప్పుడు 60 షష్ట్యంశలు బలముచేకూరును. ఉదాహరణ జాతకములో

అహస్సు ఘ 27.54 వి.లు, రాత్రి కాలముఘ 32.06 వి.లు కాబట్టి జననము

రాత్రి మూడవ భాగము కుజునకు 60 షష్ట్యంశలు

ఎల్లవేలలు గురువునకు 60 షష్ట్యంశలు

## 4వ అధ్యాయము 3 కాల్బలము 4. అబ్దమాసాది బలము

4.3.4 కాల్బలవములో నాల్గవది అబ్దమాసాది బలము: అబ్దమాసాది బలవములో వర్షాధిపతి, మాసాధిపతి, జనన వారాధిపతి జననకాలహోరాధిపతి యొక్క సముదాయ బలమే అబ్దమాసాధి పతులు యొక్క బలము అగును.

సృష్టాది అహర్గణము కనుగొని సంవత్సరములు నెలలు రోజులు కనుగొని ఆయా అధిపతులకు బలము చేకూర్చవలయును. సౌరమానప్రకారము సాధింపవలయును. బి. వి. రామన్ గారు భావబల గ్రంధములో అధిపతులను సాధించుట చెప్పియున్నారు. తే 02-05-1827 దీకి వారు అహర్గణను నిర్ణయించి ఆరోజునుండి జననతేదీకి అహర్గణము కనిపెట్టి 360 చే భాగించి లబ్దమును 3 చే గుణించి 1 కూడి 7 చే భాగించినయెడల బుధవారముతో సహా లెక్కించినయెడల వర్షాధిపతి అగును. అదే అహర్గణము ను 30 చే భాగించగా వచ్చెడి లబ్దమును 2చే గుణించి 1 కలిపి 7చేభాగించగా వచ్చెడి శేషము బుధవారముతో సహా లెక్కించినయెడల మాసాధిపతి అగును. అటులనే అహర్గణమును 7చే భాగించిన వచ్చెడి శేషము బుధవారాదిగా జననవారవంగును. ఉదాహరణ జాతకములో జననము తే 30-12-1979ది గనుక ఆరోజుకు బి.వి. రామనన్ గారి గ్రహ భావబలగ్రంధము ప్రకారము గుణంచడమయునది. 02-5-1827 నుండి (బుధవారము) 30-12-79 వరకు రెండు రోజులు కలిపి లెక్కంచినయెడల అహర్గణము 55760 అయినది. లీపు సంవత్సరమునకు ఒక్క రోజు ఎక్కువ కలుపుకొనుము. 55760/360=లబ్ధము154 ను 3చే పెంచి 1ని కూడినయెడల 154 ను 3చే పెంచి 1ని కూడినయెడల 154X3=462+1=463 అయినది.7చే భాగించగా శేషము 463/7=1శేషమయినది. కాన బధవారాదిగా బుధుడు అధిపతి అయినందువలన వర్షాధిపతి 15 షష్ట్యంశలు.

మాసాధిపతి. 55760/30=లబ్ధము 1858 ను 2చే పెంచి 1 ని కూడిన యెడల (1858X2=3716+1=3717/7=శేషము అయినది. అనగా బుధవారాదిగా మంగళవారము అయినది. కుజునకు 30 షష్ఠ్యంశలు.వారాధిపతి 55760/7=శేషము 5 అయినది. బుధవారాదిగా ఆదివారము అయినది.కాన రవి 45 షష్ఠ్యంశలు. హోరాధిపతి కుజుడు 60 షష్ఠ్యంశలు. 2 ఘడియలు హోర అగును. ఆదివారము నాడు రవి హోర మొదట వచ్చును. రవి, శుక్ర, బుధ, చంద్ర, శని, గురు కుజ క్రమములో వచ్చును. జననము శనివారము సూర్యోదయాది ఘడియలు 58 విఘడియలు 32గాన శనివారము ఆఖరిహోరయగును. శనిలో ప్రారంభయిన హోర 24వది కుజహోర అయినది.

యింకొక విధము : లగ్నస్ఫుటములో రవి స్ఫుటము తీసివేసి శేషమును రెండుతో పెంచుము. 7 రాసులు మించిన 7చే భాగించుము. శేషము వరుస క్రమములో హోరయగును.

| ఉదాహరణ జాతకములో | రా. బా | లి. వి | భాగలు |
|---|---|---|---|
| లగ్నము | 08.05 | 28.56 | 245.482 |
| రవి | 08.14 | 07.23 | 254.123 |
| శేషము | 11.21 | 21.33 | |
| రెండుచే పెంచగ | 23.12 | 43.06 | |
| 7కు మించినదిగాన 7చే భాగించగా శేషం | 2.06 | 36.37 | |

శనివారము గాన వరుసక్రమములో శని, గురు, కుజుడు అయినది. మూడవది వరుసక్రమము అనుబంధము 4 చూడుము.

బి.వి.రామన్‌గారి సృష్ట్యాది అహర్గణమును బట్టి 02=05=1827 నాటికి 714 404 096 641 యున్నది. అనగా 02.05.1827 రోజులో కలిపివున్నది. ముందురోజుకు అహర్గణము సృష్ట్యాది 714 404

౦౨౬ ౬౪౦ రోజులయినది.

రామన్‌గారి గ్రంథము ప్రకారం అహర్గణము 55760 రోజులు. ఈ అహర్గణము తీసివేయగా సృష్ట్యాది జనన తేది వరకు అనగా నెం. 12.1979 వరకు 714 404 096 (-) 55760 = 714 404 152 400 అయినది. యిదే పద్ధతిన గణితము తప్పొప్పొ అని పరిశీలించుటకు చూడండి. పై అహర్గణమును 360 చే భాగించగా లబ్దము 198 445 59278 అయినది. ఈ లబ్దమును 3 చే పెంచి ఒకటిని కూడి 7చే భాగించగా శేషము 4 అయనది. ఆదిరారాది బుధవారము అధిపతి బుదుడు 15 షష్ఠ్యంశలు పై గణితములో సరిపోయినది. మాసాధిపతికి ప్ర అహర్గణమును 30చే భాగించిన యెడల లబ్దము 134 717 46 అయినది. యీ మొత్తము 2చే గుణించి 1ని కలిపిన యెడల 476 269 434 93 అయినది. 7చే భాగించగా శేషము 3 అయినది. ఆదివారాది మంగళవారము అదిపతి కుజుడు 30 షష్ఠ్యంశలు సరిపోయినది. 7 చే భాగించగా శేషము 1. రవి 45 షష్ఠ్యంశలు బలము.

ఈ అబ్దమాసాది బలము కొరకు గణిత బహుళ్యమైనప్పటికి రెండు మూడు విధములుగా గణించి పాఠకులకు విపులము చేపయదలచి సూర్య సిద్దాంత ప్రకారం వ్రాయడమైనది.

కలిగత సంవత్సరములలో (అనుబంధము 5) 4548ని తీసివేసిన శేషమును ధృవాబ్దములగా భావించుము.

ఉదాహరణ జాతకములో కలిగత సంవత్సరములు 5080

తీసివేయగా (-) 4548

శేషము ధృవాబ్దములు 532

ఈ ధృవాబద్దములను 12చే గుణించి జనన మాస గత మాసములును కలిపి రెండు ప్రతులుగా పెట్టుము. (అంటే రెండు చోట్ల ప్రత్యేకముగా వ్రాసుకొనుట) అందు రెండవ ప్రతిని 20చే గుణించి దానిని మరల రెండు ప్రతులు పెట్టి అందు రెండువ ప్రతియందు 491 1220 కలిపి దానిని

౬౦౦౦౦౦ చే (ఆరు లక్షలు) భాగించగా వచ్చెడి లబ్ధమున్నూ ౨౭౭ ని పై ప్రతిలో కలిపి ధృవాబ్దములను తీసివేసి ౬౪౮చే భాగించగా వచ్చిన లబ్ధము అధిక మాసములు అగును. ఈ అధిక మాసములను పై ప్రతిలో కలిపి ౩౦చే గుణించి యిష్టతిథి సహితముగా శుక్లపక్షాది తిథులను కలుపవలయును. తదుపరి ఆ కలపగా వచ్చిన మొత్తమును మూడు ప్రతులు పెట్టి అందు మూడవ ప్రతిలో ౩౬౯ని కలిపి ౪౨చే గుణించి ౨౯౭౩౭చే భాగించగా వచ్చిన లబ్ధము క్షయతిథులు అగును. ఈ క్షయతిథులను పై ఒకటవ ప్రతిలో తివచగా <u>భృగువారాది అహర్గణము అగును</u>. యీ అహర్గణమును భృగువారాదిగా (శుక్ర) లెఖించవలయును. ఈ అహర్గణమును సావనద్యుగణము అని తెలుసుకోనగును. అనగా సూర్యోదయము మొదలు సూర్యోదయము వరకు అని తెలుసు కొనవలయును. యీ అహర్గణమును ౭చే భాగించిన యెడల శుక్రవారాదిగా జనన వారము అగును. ఒకవేళ వారము రాని యెడల ౧ని కలిపి గాని తీసివేసిగాని అహర్గణమును సరిచూచుకొని సవరింపవలయును. ఈ అహర్గణముతో ౭౧౪, ౪౦౩, ౯౫౭, ౮౧౧ను కలిపిన యెడల సృష్ట్యాది భానువార్త్రాదిగా అహర్గణము అగును. యీ అహర్గణమును ౩౦చే భాగించి లబ్ధమును ౨చే గుణించి ౧ కలిపి ౭చే భాగించిన యెడల శేషము సావన మాసాధిపతి యగును. అటులనే ౩౬౦చే భాగించి లబ్ధమును ౩చే గుణించి ౧ కలిపి ౭ఛే భాగించిన యెడల సావన వర్షాధిపతియగును.

ధృవాబ్దములు 532ను 12చే పెంచగా 6384

గత మాసములు చైత్రము మొదలు, మార్గశీర్షము వరకు <u>9</u>

6393 రెండు ప్రతులు పెట్టుట

| | (1) | (2) | |
|---|---|---|---|
| దీనిని రెండు ప్రతులు | 6393 | 6393 | |
| రెండవ ప్రతిని 20చే గుణించి | 196 | 20 | |
| | 6589 | 127860 | యిది రెండు ప్రతులు |
| | <u>30</u> | | |
| | 197670 | | యిది రెండు ప్రతులు |
| జనన తిథిసహితముగా కలిపిన | <u>12</u> | | |

197682 మూడు ప్రతులు పెట్టుము

| (1) | (2) |
|---|---|
| 127860 | 127860 |
| లబ్ధము 1 | <u>491220 +</u> |
| <u>277</u> | <u>619080</u> |
| 128138 | 600000 |

ధృవాబ్దములు (-) 532 లబ్దము 1

127606/648 = లబ్దము

196 అధిక మాసములు పై ప్రతిలో కలుపుము.

| (1) | (2) | (3) |
|---|---|---|
| 197682 | 197682 | 197682 |
| 3093(-) | 279(+) | 369(+) |

53 (+)→ 198051X 42

194589 198014÷64 8318142÷29737=279

అయినది. లబ్దము 3093 క్షయతిధులు = లబ్దము 279 యీ అహర్గణమును (194589) 7చే భాగించన యెడల (3) శుక్రవారాదిగా జనన వారంబగును. 194589/7 = శేషము 3 అయినది. శుక్రవారాదిగా ఆదివారమయినది. జననవారము సరిపోయినది.

యీ అహర్ణమును 714 403 957 811 తో కూడిన యెడల సృష్ట్యాది అహర్గణము అగును. యీ అహర్గణము భానువారాదికము అగును.

7144039578111

194589

సృష్ట్యాది అహర్గణము 714404 152400

7చే భాగించగా శేషము 1 ఆదివారము సరిపోయినది. పైన వ్రాసినటుల గణించి సాధించిన వర్షాధిపతి - మాసాధిపతి - గ్రహములు కాన

వర్షాధిపతి బుధుడు 15 షష్ట్యంశలు

| | | |
|---|---|---|
| మాసాధిపతి కుజుడు | 30 | -do- |
| వారాధిపతి రవి | 45 | -do- |
| హోరాధిపతికుజుడు | 60 | -do- |

(అనుబంధము 4 చూడుడు హోరాధిపతి)

4,3,5, కాల్బలములో అయిదవది అయన బలము. చాల క్లిష్ట గణితముతో కూడుకొన్నది.

స్పుటగ్రహములలో అయనాంశలు చేర్చిన యెడల సాయన స్పుటగ్రహములగును. అయనాంశలు అన్ని పంచాంగములలో యిచ్చి యున్నారు. 50.4 విలిప్తలని ఆధునిక పంచాంగ కర్తలు 54 విలిప్తలు అని సూర్య సిద్ధాంతము చెప్పచున్నది. ఏ అయనాంశ అయినప్పటికి సాయన గ్రహములు మాత్రము మారవు. క్యాలెండరు రిఫారమ్సువారు 50.4 విలిప్తలని హెచ్చు పంచాంగ కర్తలు యీ అయనాంశనే వాడుచున్నారు.

ఉదాహరణ జాతకములో కూడా ఆధునిక అయనాంశయే అనురించడము జిరిగినది.

ఈ సాయన గ్రహములు మేషాది షట్కమయిన (0 భాగాలు నుండి 180 భాగడలు వరకు) ఉత్తరక్రాంతి అనియు (North Declination) తులాది షట్కమయిన యెడల (181 భాగ నుండి 360 భాగం వరకు) దక్షిణక్రాంతి అనియు తెలుసుకొనగలరు. గ్రంథ బాహుళ్యము వలన ఆయన బల గణితమునకు కావలసిన వివరముల మాత్రము యివ్వడమైనది. పూర్తి త్రిజ్య 3438 పరమాజ క్రమజ్యయగు 1397చే (ఘుమారు 24 భాగలు) గ్రహములకు భుజను సాధించి 1397 చే గుణించి 3438చే భాగించగా క్రాంతిరజ్య యగును. ధన యిన్నగా క్రాంతి యగును. రవి,కుజ,గురు,శక్ర ఉత్తర క్రాంతియైన పరమాసక్రమజ్యలో కలుపవలయును. దక్షిణ క్రాంతి అయిన యెడల తీసివేయవలయును. అదే విధముగ చంద్రశని గ్రహములు దక్షిణ క్రాంతి అయిన కలుపవలయును. ఉత్తర క్రాంతి అయిన యెడల స్రివేయవలయును బుధునకు మాత్రము ఏ క్రాంతి అయినను కలుపవలయును. రవి గ్రహమునకు ఆయన బలము రెండింతలు చేయవలయును.

భుజలను సాధించుట :

సాయన గ్రహము మూడు రాసులలో వున్న యెడల అదియే భుజమగును.

సాయన గ్రహము 4 రాసులు నుండి 6 రాసులలో నున్న యెడల ఆరు రాసులలో సాయన గ్రహమును తీసివేయుము. 6 రాసుల నుండి 9 రాసులలో నున్న యెడల సాయన గ్రహములో ఆరు రాసులు తీసివేయుము. 9 రాసుల నుండి 12 రాసులలో సాయన గ్రహమున్న యెడల 12 రాసులలో స్ఫుటగ్రహమును తీసివేయుము.

4.3.5 భుజము సాధించిన తదుపరి సంస్కరించవలసిన విధానం పూర్తి క్రాంతి 24 భాగలు లేక 1440 లిప్తలు, భుజలో మొదట 15 భాగలకు 362 లిప్తలు క్రాంతియనియు రెండవ 15 భాగలుకు 341 లిప్తలు అనియు 0 భాగ నుండి 30 భాగలుకు (70 విలిప్తలు) మూడవ 15 భాగలు (31 నుండి 45) 299 లిప్తలు (మొత్తము 1002) నాల్గవ 15 భాగలు (46 నుండి 60 వరకు) 236 లిప్తలు (1238) అయిదవ పదిహేను భాగలుకు (60 నుండి 75 వరకు) 150 లిప్తలు (1388) ఆరవపదిహేను భాగలు 52 లిప్తలు (1440 పూర్తి) అని నిర్ణయించినారు. మొత్తం మూడు రాసులకు 1440 లిప్తలు అయినది. భుజను బట్టి క్రాంతి లిప్తలు అనుపాతముగా నిర్ణయించవలయును. యీ క్రాంతి భాగలను పరిపూర్ణ క్రాంతితో సంస్కరించిన యెడల అనగా గ్రహక్రాంతిని బట్టి కూడుట తీసివేయుట) తదుపరి 48చే భాగించిన బలము రూపములో వచ్చును. 60చే పెంచిన యెడల షష్ట్యంశలు అగును. రవికి ఆయన కబలము రెండింతలు చేయమని యిదివరకే చెప్పియున్నది.

ఇప్పడు భుజము సాధించుట - ఉత్తర, దక్షిణ క్రాంతి నిర్ణయించుట.

| గ్రహము | నిరయణ భాగలు | అయనాంశ 23.57°కలుపగా | భుజభాగలు | 15 భాగలు యూనిట్లు మరియు శేష భాగలు |
|---|---|---|---|---|
| 1. రవి | 254.123 భాగలు | 277.698.ద | 82.302 | 5 శేషము 7.302 |
| 2. చంద్ర | 033.006 " | 56.581 ఉ | 56.581 | 3 -do- 11.581 |
| 3. కుజ | 140.037 " | 163.312 ఉ | 16.388 | 1-do- 1.388 |
| 4. బుధ | 241.381 " | 264.956 భ | 84.956 | 5 -do- 9.956 |
| 5. గురు | 136.650 " | 160.225 ఉ | 19.775 | 1-do- 4.775 |
| 6. శుక్ర | 285.376 " | 308.951 ద | 51.049 | 3 -do- 6.049 |
| 7. శని | 153.383 " | 176.958 ఉ | 03.042 | 0 -do- 3.042 |

| గ్రహము | యూనిట్ల లిప్తలు | శేషభాగ లిప్తలు | మొత్తం లిప్తలు | భాగలలోకి మార్చగా వచ్చిన క్రాంతిభాగలు | 24 భాగలలో సంస్కరించగా శేషము భాగలు | 48చే భాగిం చగా వచ్చిన బలమురూపము | 60చే గుణిం చగా వచ్చిన షష్ఠ్యంశలు |
|---|---|---|---|---|---|---|---|
| రవి (-) | 1388 | 25.313 | 1413.313 | 23.555 దక్షిణం | 00-445 | 0.0092708 | 1.112 రెండింతలు |
| చంద్ర (-) | 1002 | 182.207 | 1184.207 | 19.736 ఉత్తరం | 04-264 | 0.0888338 | 5.329 |
| కుజ (+) | 362 | 31.553 | 393.553 | 6.559 --- | 30.559 | 0.6366458 | 38.198 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బుధ (+) | 1388 | 34.514 | 1422.514 | 23.708 దక్షిణము | 47.708 | 0.9939166 | 59.634 |
| గురు (+) | 362 | 108.551 | 470.551 | 7.842 ఉత్తరం | 31.842 | 0.663375 | 39.802 |
| శుక్ర (-) | 1002 | 95.170 | 1097.170 | 18.286 దక్షిణ | 5.714 | 0.1190416 | 7.142 |
| శని (-) | | 73.413 | 73.413 | 1.223 ఉత్తరం | 22.772 | 0.4744166 | 28.464 |

సూచన : పైన ప్రతి 15 భాగలుకు క్రాంతి లిప్తలు యిచ్చివున్నవి. వాటి ప్రకారం గణితము చేయడమైనది.

## యింకొక పద్ధతి : 4.3.5 అయనబలము

పండితాభూషణ సుబ్రమణ్య శాస్త్రి గారి విరచిత కొద్ది పాటి సులభముగా తోచుచున్నది.

ఇది వరలోనే భుజను సాధించి యున్నాము గదా. ఈ భుజలు మూడు రాసులలోనే వుండును గదా.

1. ఈ భుజ 1 రాశి (30 భాగలలో) వున్నయెడల భాగాదులను 45చే పెంచి 30 చే భాగించవలయును (45/30)

2. 1 రాసి పైన రెండు రాసులలోన యున్నచో 33చే హెచ్చించి 30 చే భాగాదులను భాగించి 45ను కలుపవలయును.

3. రెండు రాసులపైన మూడు రాసులలో పల భుజ వున్న యెడల రాసులు మినహాయించి భాగాదులను 12చే పెంచి 30చే భాగించి 78ని కలుపుము. అటుల కలుపగా వచ్చిన భాగాదులను ఉత్తర, దక్షిణ క్రాంతుల ప్రకారము 90 భాగలలో సంస్కరించి 3చే భాగించిన అయన బలషష్ఠ్యంశలు వచ్చును.

### ఉదాహరణ జాతకములో

| గ్రహము | భుజభాగలలో | రాసులుపోను | సంస్కరించగా | 90 భాగలలో సంస్కరించిన | 3చే భాగించగా వచ్చిన షష్ఠ్యంశలు |
|---|---|---|---|---|---|
| 1. రవి | 82.302ద (-) | 22.302X12÷30 | 8.9208+78 | 3.0792 | 1.0264X2= 2.0528 |
| 2. చంద్ర | 56.581 ఉ (-) | 26.581X33÷30 | 29.2391+45 | 15.7609 | 5.2536 |
| 3. కుజ | 16.388 ఉ (+) | 16.388X45÷30 | 24.582+00 | 114.582 | 38.194 |
| 4. బుధ | 84.956 ద (+) | 24.956X12÷30 | 9.9826+78 | 177.9824 | 59.327 |
| 5. గురు | 19.775 ఉ (+) | 19.775X45÷30 | 29.6625+0 | 119.6625 | 39.8875 |
| 6. శుక్ర | 51.049 ద (-) | 21.049X33÷30 | 23.1539+45 | 24.8461 | 7.2820 |
| 7. శని | 03.042 ఉ (-) | 3.042X12÷30 | 1.2168+00 | 88.7832 | 29.5944 |

యించుమించు అయనబలములో పెద్దమార్పు ఏమియు లేదు. పాఠకుల ఇష్టానుసారము ఏ పద్ధతినైనను అవలంబించవచ్చును.

<u>4.3.6 కాల్బలములో ఆరవది కడపటిది యుద్ధబలము</u>. కుజాది పంచమ వక్రగ్రహములు ఒకే భాగమందున్న యెడల పరస్పరముగార యుద్ధము ఏర్పడును. జయాపజయములు నిర్ణయించి కాల్బలములో హోరా బలమువరకు సాధించిన బలములో సంస్కరించవలయును. గెలిచిన గ్రహములో కలుపవలయును. అపజయము

పొందిన గ్రహములో యుద్ధ బలము తీసివేయవలయును.
రెండు గ్రహములు ఋజుగతి కలిగినపుడు అల్పగతి గల గ్రహమును అధికగతి గల గ్రహము నుండి తీసివేయవలయును. ఈ తీసివేసిన మొత్తమున బింబ పరిమాణము యొక్క భేధముతో సంస్కరించవలయును. జయము పొందిన గ్రహములో కలుపవలయును. అపజయము పొందిన గ్రహములో తీసివేయవలయును. రెండు గ్రహములలో ఒక గ్రహము ఋజుగతి మరియొక గ్రహము వక్రగతి కలిగివున్న యెడల ఋజుగతి అధికముగాను, వక్రగతి తక్కువగానున్న యెడల యుదలుకాలము అయిపోయినదనియు, వక్రగ్రహము అధికముగా నుండెనేని యుద్ధకాలము ముందు వున్నదనియు తెలుసుకొనగలరు. రెండు గ్రహములు వక్రించి యుండునపుడు అధికగతి గల గ్రహము అధికముగా నుండెనేని యుద్ధకాలము రాగలదనియు అల్పముగ నుండెనేని యుద్ధకాలము అయిపోయినట్లు తెలుసుకొనగలరు. బింబ వ్యాసము యోజనములలో కుజ 30, బుధ 45, గురు 52.5, శుక్ర 60, శని 37.5 కలిగివున్నారు. బింబాంతరముచే భాగించి వచ్చిన లబ్ధము ఉత్తర దిశ యందున్న కాల్బలములో చేర్చవలయునం. దక్షిణదిశ యందున్న గ్రహముయొక్క అంతరము తీసివేయవలయును. బింబ పరిమాణ లిప్తలు కుజ 9.4, బుధ 6.6, గురు 190.4, శుక్ర 16.6, శని 158.

ఉదాహరణజాతకములో ఏ రెండు వక్ర గ్రహములు ఒకే భాగమందులేనందున యుద్ధ బలములేదు.

## 3 కాల్బల సంగ్రహ పట్టిక

| బల వివరణ | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 3.1 దివారాత్రిబలము | 29.166 | 30.633 | 30.833 | 60.000 | 29.166 | 29.166 | 30.833 |
| 2. పక్షబలము | 13.706 | 92.588 | 13.706 | 13.706 | 46.294 | 46.294 | 13.706 |
| 3. త్రిభాగ ఫలము | ------ | ------ | 60.000 | ------ | 60.000 | ------ | ------ |
| 4. అబ్దమాసాది బలము | 45.000 | ------ | 30.000 | 15.000 | ------ | ------ | ------ |
| | | | 60.000 | | | | |
| 5. అయనబలము | 1.112 | 5.329 | 38.198 | 52.634 | 39.802 | 7.142 | 28.644 |
| 6. యుద్ధబలము | లేదు | లేదు | లేదు | లేదు | లేదు | లేదు | లేదు |
| మొత్తము షష్ఠ్యంశలు | 88.984 | 128.750 | 232.737 | 148.340 | 175.262 | 82.602 | 73.183 |

షష్ఠ్యంశలలో అయనబలము కాకుండా వుండవలసిన కాల్బలము

| | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| సాధించిన కాల్బలము | 87.812 | 123.421 | 194.539 | 88.700 | 135.460 | 75.460 | 45.539 |
| వుండవలసిన కాల్బలము | 112.00 | 100.000 | 67.000 | 112.000 | 112.000 | 100.000 | 67.000 |

షష్ఠ్యంశలలో అయనబలము

| | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| సాధించిన అయనబలము | 1.112 | 5.329 | 38.198 | 59.634 | 39.802 | 7.142 | 28.644 |

| వుండవలసినది | 30.000 | 40.000 | 20.000 | 30.000 | 30.000 | 40.000 | 20.000 |
|---|---|---|---|---|---|---|---|

నాల్గవ అధ్యాయము సమాప్తము

## 5వ అధ్యాయము. 4 చేష్టా బలము

షడ్బలములలో నాల్గవది చేష్టాబలము. క్లిష్టమయిన గణితము కుజాది పంచమ వక్రగ్రహములుకు కనుగొనవలయును.

ముందు మధ్య గ్రహములు స్ఫుటము చేయవలయును. ఈ విధముగా స్ఫుటము చేసిన మధ్యగ్రహమును స్ఫుట గ్రహములో తీసివేసి అర్ధించవలయును. ఈ అర్ధించిన ఫలము స్ఫుట గ్రహము కంటె మధ్య గ్రహము అధికముగా నుండెనేని ఆ గ్రహము యొక్క శీఘ్రోచ్చలో చేర్చవలయును. స్ఫుటగ్రహము కంటె మధ్యగ్రహము తక్కువగా నున్న యెడల ఆ అర్ధించిన ఫలమును ఆ గ్రహము యొక్క శీఘ్రోచ్చలో తీసివేయవలయును. యిటుల సంస్కరించిన శీఘ్రోచ్చలలో ఆయా స్ఫుట గ్రహమును తీసివేసిన చేష్టా కేంద్రమగును. ఈ చేష్టా కేంద్రము 6 రాసుల కన్నా అధికముగా నున్నయెడల పండ్రెండు రాసులలో తీసివేయుము. ఆరు రాసులలో వున్న యెడల అదియే చేష్టా కేంద్రమగును. ఆ కేంద్రమును లిప్తలు చేసి 10800 (6X1800) చే భాగించిన యెడల చేష్టా బలము వచ్చును.

<u>మధ్య గ్రహము రాబట్టుట</u> : యిచ్చట గ్రహము యొక్క వక్రగతి, శీఘ్రగతి, మందగతి వగైరాలు గణితములోకి వచ్చినట్లు లేదు. అహర్గణమును సూర్య సిద్ధాంత ప్రకారము సాధించి ఆయా గ్రహము యొక్క

దిన భుక్తులలో గణించి పూర్వ ధృవములతో సంస్కరించిన యెడల మధ్యాహ్న లంక మధ్య గ్రహమగును. (లంకయని సంభోదించుట భూమధ్యరేఖ దగ్గరగాన) యిదివరలో కాల్పలవములో అహర్గణము సాధించుట యిచ్చివున్నది. యిచ్చట మరియొక విధముగా అహర్గణమును సాధించుట చెప్పబడుచున్నది. గణితములలో రెండు వకటిగానే వుండును. కాని పాఠకుల మన్నన కొరకు గణిత సౌలభ్యము కొరకు యిచ్చుచున్నాము. అనుబంధము 6లో కలి గత సంవత్సరములు ధృవాబ్దములు యిచ్చివున్నది. 1927-28 ప్రభవ మొదలు 2046-47 అక్షయ వరకు యివ్వడమైనది. అనుబంధము 7లో గ్రహ దిన భుక్తులు యిచ్చివున్నది.

నృసింహ సిద్ధాంత గణితమును అనుసంచరించడమైనది. దిన భుక్తులతో అహర్గణము ప్రకారము మధ్యాహ్న గ్రహములు రాబట్టు కోవచ్చును. లేని యెడల గుణించినను భాగలలో వచ్చును.

ఈ పై సంవత్సరములకు ముందు వెనుక సంవత్సరములకు గూడా వుపయోగపడును.

<u>ఉదాహరణ జాతకము</u> : శిద్రాద్రి నామ సంవత్సరర పుష్యశుక్ల ద్వాదశి ఆదివారం సరియగు తే 30.12.1979ది కలిగత సంవత్సరములు

(1979-80) 5080

శాలివాహన శక గత సంవత్సరములు 3179 తీసివేసిన వచ్చును.

3179

శాలివాహన శక గత సంవత్సరములు 1901

దీనిలో 1790 తీసివేసిన ధృవాబ్దములు అగును 1790

ఆలోచించిన యెడల 5080-111 : 4969 వరకు ధృవాబ్దములు

111

గణించనట్లున్నది. ఈ ధృవాబ్దములను బట్టి అహర్గణము సాధించి దిన భుక్తులచే గుణించగా మధ్య గ్రహములు వచ్చును.

ధృవాబ్దములను 12చే గుణించి చైత్రాది గత మాసములు క
మూడు ప్రతులుగా పెట్టవలెను (అనగా వరుసగా మూడు
వ్రాసుకొనుట) కడప్రతిని 61 చే భాగించగా వచ్చిన లబ్దము రెండవ ప్ర
తీసివేసి 23ను కూడవలసివున్నది. తదుపరి 32చే భాగించగా వ
లబ్దము అధికమాసములు అగును. ఆ విధముగా వచ్చిన అధిక మాసమ
ఒకటవ ప్రతిలో కలుపలవలయును.

ధృవాబ్దములు 111ను 12చే గుణించగా 1332 అగును. చైత్రాది
మాసములు 9 కలిపిన యెడల 1341. యీ

| | (1) | (2) | (3) |
|---|---|---|---|
| మొత్తమును మూడు | 1341 | 1341 | 1341÷61 |
| ప్రతులు పెట్టుట | (+)41 | (-)21 | 21 = లబ్దము |
| | 1382 | 1320 | 1320 |
| | | (+)23 | |
| | | 1343÷32 = లబ్దము 41 | |

యీ ఒకటవ ప్రతిని 30చే పెంచి శుక్లపక్షాది తిధులు కలుపుము.
1382X 30 = 41460 + తిదులు 12 = 41472 అయినది. దీ
మూడు ప్రతులు పెట్టుము.

| (1) | (2) | (3) |
|---|---|---|
| 41472 | 41472 | 41472 |

కడప్రతిని 703చే భాగించగా వచ్చెడి లబ్దమును 23ను రెండవ ప్రతి
చేర్చుము. తదుపతి ఆ రెండవ ప్రతిని 64చే భాగించిన లబ్దము క్ష
తిదులగును. యీ క్షయ తిధులను 1వ ప్రతిలో తీసివేసి శేషము 7
భాగించగా బుధవారాది జననవారమగును. వారము రానిచో 1
కూడిగాని, తీసివేసిగాని అహర్గణము సరిచేసుకోవలయును.

